శ్రీ ర స్తు.

# విక్రమార్కచరిత్రము

సటీకము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము.

1950.

శ్రీరస్తు.

# విక్రమార్కచరిత్రమ్.

---

శ్రీపురాణపురుషం పురాన్తకం పద్మసంభవ ముమాసుతం మయా,
సంప్రణమ్య చ సురాన్ సరస్వతీం విక్రమార్కచరితం విరచ్యతే. 1

అస్తి కిల మాలవేషు సమస్తవస్తుసంపూర్ణా స్వగుణపరాభూతపురన్దరపుర విభూతి రుజ్జయినీనామ నగరీ. తత్ర సమస్తసామన్తసీమన్తినీసీమన్తసిన్దూరారుణచరణ

టీక.—శ్రీపురాణపురుషం = కాంతితోఁగూడిన యాదిపురుషుఁడయిన విష్ణువును, పురాన్తకం = త్రిపురములకు నాశకుఁడయిన శివుని, పద్మసంభవం = విష్ణువు యొక్క నాభికమలమందుఁ బుట్టినవాఁడగు బ్రహ్మదేవుని, ఉమాసుతం = పార్వతికిఁ బుత్త్రుఁడగు వినాయకుని, సురాన్ = వేల్పులను, సరస్వతీం = సరస్వతీదేవిని, సంప్రణమ్య = లెస్సగా నమస్కరించి, మయా = నాచేత, విక్రమార్కచరితం = విక్రమార్కునికథ అను గ్రంథము, విరచ్యతే = చేయఁబడుచున్నది.

నేను బ్రహ్మ విష్ణు శివులను, వినాయకుని, తక్కిన దేవతలను నమస్కరించి, విక్రమార్కచరిత్ర మను గ్రంథమును రచింపఁబోవుచున్నాను.

## కథాప్రారంభము.

మాలవేషు = మాలవదేశమునందు, సమస్తవస్తుసంపూర్ణా = సకల వస్తువులతో నిండినదియు, స్వగుణ...విభూతిః-స్వ = తనదైన, గుణ = మంచి గుణములచేత, పరాభూత = తిరస్కరింపఁబడిన, పురన్దరపుర = ఇంద్రుని పట్టణముయొక్క (అమరావతి యొక్క), విభూతిః = కలిమిగలదియు, (అమరావతిపురముకంటె మించిన వైభవములు గలదియు) అగు, ఉజ్జయినీ నామ = ఉజ్జయిని యను ప్రసిద్ధమయిన, నగరీ = పట్టణము, అస్తి కిల = ఉన్నదిగదా. తత్ర = ఆ ఉజ్జయినీపురమునందు, సమస్త...చరణః-సమస్తసామన్త = చుట్టుపట్టులనుండు రాజులందఱియొక్క, సీమన్తినీ = స్త్రీలయొక్క, సీమన్త = పాపటలయందలి, సిందూర = కుంకుమముచేత, అరుణ = ఎఱ్ఱనైన, చరణకమల = కమలములవంటి

కమలయుగళో భర్తృహరి ర్నామ రాజాఽఽసీత్. స చ సకలకలాప్రవీణః సమస్తశాస్త్రాభిజ్ఞశ్చ. తస్య చ రాజ్ఞః స్వవిక్రమాపహృతవైరివిక్రమో విక్రమో నామానుజోఽభూత్. తత్ర చ నగరే సకలశాస్త్రాభిజ్ఞః సమస్తమన్త్రశాస్త్రప్రవీణో బ్రాహ్మణః కశ్చి దజాయత. స కేవలం దరిద్రః. స హైకదా మన్త్రానుష్ఠానేన భువనేశ్వరీ మతోషయత్. సా తు సంతుష్టా బ్రాహ్మణ మాహ—“భో బ్రాహ్మణ! ఫల మేత ద్భక్షయ. అనేన జరామరణవర్జితో భవిష్యసి.” బ్రాహ్మణ స్తత్ఫలం గృహీత్వా స్వభవనం ప్రత్యాగత్య స్నాత్వా దేవార్చనాం విధాయ, యావ త్ఫలం భక్షయితు మయ

పాదములయొక్క, యుగళం = జంటగలవాఁడగు, (రాజుల స్త్రీలచే మ్రొక్కఁబడువాఁడు) భర్తృహరి ర్నామ రాజా = భర్తృహరి యనెడిరాజు, ఆసీత్ = ఉండెను. సచ = ఆరాజు, సకల...వీణః-సకల = అన్ని, కళా = విద్యలందు, ప్రవీణః = నేర్పరియు, సమస్త...భిజ్ఞశ్చ-సమస్త = అన్ని, శాస్త్ర = శాస్త్రములను, అభిజ్ఞశ్చ = ఎఱిఁగినవాఁడును. (కం)చ = మఱియు, తస్య = ఆ, రాజ్ఞః = రాజునకు (భర్తృహరికి), స్వ...విక్రమః-స్వ = తనయొక్క, విక్రమ = మగఁటిమిచేత, అపహృత = పోఁగొట్టఁబడిన, వైరి = పగతురయొక్క, విక్రమః = మగఁటిమిగల (తన మగఁటిమిచే పగతురమగఁటిమి నణఁచినవాఁడగు), విక్రమః-నామ = విక్రమార్కుఁ డనుపేరుగల, అనుజః = తమ్ముఁడు, అభూత్ = ఉండెను. (కం) చ = మఱియు, తత్ర = ఆ, నగరే = పురమునందు, సకలశాస్త్ర-అభిజ్ఞః-సకల = అన్ని, శాస్త్ర = శాస్త్రములను, అభిజ్ఞః = ఎఱిఁగినవాఁడును, సమస్త...ప్రవీణః-సమస్త మన్త్రశాస్త్ర = మన్త్రశాస్త్రము లన్నిటియందు, ప్రవీణః = నేర్పరియునైన, బ్రాహ్మణః = బాఁపఁడు, కశ్చిత్ = ఒకానొకఁడు, అజాయత = ఉండెను. సః = ఆబ్రాహ్మణుఁడు, కేవలం = మిగుల, దరిద్రః = పేదయైనవాఁడు. సః-చ = ఆబ్రాహ్మణుఁడును, ఏకదా = ఒకప్పుడు, మన్త్రఅనుష్ఠానేన = మన్త్రమును పునశ్చరణచేయుటచే, భువన-ఈశ్వరీం = కాళికాదేవిని, అతోషయత్ = సంతోషపెట్టెను. సాతు = ఆకాళికయు, సంతుష్టా = సంతోషము నొందినదై, బ్రాహ్మణం = విప్రునిఁగూర్చి, ఆహ = పలికెను. భో బ్రాహ్మణ = ఓబ్రాహ్మణుఁడా!, ఏతత్ = ఈ, ఫలం = పండును, భక్షయ = తినుము. అనేన = ఈ పండు తినుటచేత, జరామరణవర్జితః-జరా = ముదిమిచేతను, మరణ = చావుచేతను, వర్జితః = విడువఁబడినవాఁడవుగా (ముసలితనమును చావును లేనివాఁడవు), భవిష్యసి = కాఁగలవు. బ్రాహ్మణః = విప్రుఁడు, తత్ఫలం = ఆపండును, గృహీత్వా = తీసికొని, స్వభవనం = తనయింటికి, ప్రత్యాగత్య = మరలి వచ్చి, స్నాత్వా = జలకమాడి, దేవ-అర్చనాం = దేవపూజను, విధాయ = చేసి, యావత్ = ఎంతలో, ఫలం = పండును, భక్షయితుం = తినుటకొఱకు, అయతిష్ట = పూనెనో, తావత్ = అంతలోపల, అస్య = ఇతనియొక్క, మనసి

యస్మిన్ జీవతి జీవన్తి బహవః స తు జీవతు,
బకోఽపి కిం న కురుతే చఞ్చ్వా స్వోదరపూరణమ్. 3

కించ, క్షుద్రాః సన్తి సహస్రశః స్వభరణవ్యాపారపూర్ణాదరాః
స్వార్థో యస్య పరార్థ ఏవ స పుమా నేకః సతా మగ్రణీః
దుష్పూరోదరపూరణాయ పిబతి స్రోతఃపతిం బాడబో
జీమూతస్తు నిదాఘసంభృతజగత్సంతాపవిచ్ఛిత్తయే. 4

బ్రతికియున్నంతమాత్రమున నేమియు నుపయోగము లేదు. మనుష్యుఁడు జ్ఞానము, పరాక్రమము, కలిమి కలిగి యొక కొంతకాలము బ్రతికియున్నను, వాని జీవితకాలమే మేలని పెద్దలు పలుకుదురు. అట్టివాఁడు కానివాని బ్రతుకు నీచము అని భావము.

3. యస్మిన్=ఏవఁడు, జీవతి (సతి)=బ్రతికియుండఁగా, బహవః=అనేకులు, జీవన్తి=బ్రతుకుచున్నారో, సతు = వాఁడే, జీవతు=బ్రతుకునుగాక. బకః-అపి=కొంగయు, చఞ్చ్వా=ముక్కుతో, స్వ-ఉదరపూరణం = తనపొట్ట నింపుకొనుటను, న కురుతే కిం=చేయదా?

తా. కొంగ ముక్కుతో తన కడుపుమాత్రము నింపుకొనునట్లు, మనుష్యుఁడు తన చేతులతో సార్జించిన ధనంబుతోఁ దన కడుపుమాత్రము పూడ్చుకొనుచున్న నేమి యుపయోగము లేదు. కనుక, ఎవఁడు బ్రతికియుండఁగా వాని నాశ్రయించి పెక్కండ్రు జీవింతురో వాని మనుగడయే శ్రేష్ఠము.

4. కించ=మఱియు, స్వభరణ...దరాః-స్వ=తనయొక్క, భరణ=పోషించుకొనుట అను, వ్యాపార=పనియందు, పూర్ణ=నిండిన, ఆదరాః=ఆసక్తిగల, క్షుద్రాః=నీచులు, సహస్రశః=వేనవేలు, సన్తి=ఉన్నారు. యస్య=ఎవరికి, పర-అర్థ ఏవ=ఇతరుల పనియే, స్వార్థః=తన పనియో, సః-పుమాన్=ఆపురుషుఁడు, ఏకః=ఒక్కఁడే, సతాం=సత్పురుషులలో, అగ్రణీః=శ్రేష్ఠుఁడు, బాడబః=బడబాగ్ని, దుష్పూ...ణాయ-దుష్పూర=నింపబాలని, ఉదర=కడుపుయొక్క, (ను), పూరణాయ=నింపుకొనుటకై, స్రోతఃపతిం=సముద్రమును, పిబతి = త్రాగుచున్నది. జీమూతః-తు=మేఘమున్నదో, నిదాఘ...చ్ఛిత్తయే-నిదాఘ=వేసఁగియందలి, సంభృత=నిండిన, జగత్=లోకము యొక్క (జనులయొక్క), సంతాప=వేఁడిమియొక్క(ని), విచ్ఛిత్తయే=పోఁగొట్టుటకై (స్రోతఃపతిం=సముద్రమును, పిబతి=త్రాగుచున్నది.)

తా. బడబాగ్ని తన కడుపు నింపుకొనుటకై సముద్రోదకమును పానము చేసిన చందంబున, నీచులు పెక్కండ్రు తమ పనలను జూచుచుఁ దమ పొట్ట నింపు

అసంపాదయతః కశ్చి దర్థం జాతి క్రియా గుణైః,
యదృచ్ఛాశబ్దవత్ పుంసః సంజ్ఞాయై జన్మ కేవలమ్. 5

ఏవమాది విచార్య, 'ఏతత్ఫలం రాజ్ఞే దద్యాం, స జరామరణవర్జితో భూత్వా చాతుర్వర్ణ్యం ధర్మతః సవిశేషం పాలయేత్.' ఇతి నిశ్చిత్య తత్ఫలం గృహీత్వా రాజసమీప మాగత్య,

అహీనమాలికాం బిభ్ర త్తథా పీతాంబరం వపుః,
హరో హరి శ్చ భూపాల! కరోతు తవ మంగళమ్. 6

కానుటయం దుష్కృతయుక్తులవారుగా ఉన్నారు. అట్టివారివలన లోకమునకేమియు మేలు కలుగదు. మేఘములు లోకము వేడిమిని పోగొట్టుటకై సముద్రోదకమును పానము చేయునట్లు, సజ్జనులు, ఇతరులపనులే తమ పనులుగా నెంచి యాపనులను చక్కపెట్టుకొందురు. అట్టివారే మంచివారు.

5. జాతి...గుణైః-జాతి = బ్రాహ్మణాది జాతిచేతను, క్రియాః = పనులచేతను, గుణైః=సుగుణములచేతను, కశ్చిత్ =ఒకానొక, అర్థం=కార్యమును-ప్రయోజనమును, అసంపాదయతః=సంపాదింపని, పుంసః=పురుషునియొక్క, జన్మ=పుట్టుక, యదృచ్ఛాశబ్దవత్ = డిత్థ డవిత్థ అనుపేర్లవలె, సంజ్ఞాయై వకేవలం = గుర్తునకు మాత్రమే, (భవతి = అగుచున్నది.)

తా. జాతి, కార్యము, సుగుణములు వీనిలో దేని మూలముననైనను కీర్తిని సంపాదింపలేనివాని జన్మము అర్థము లేక గుర్తుకై పెట్టుకొన్న పేర్లవలెనే పనికిరానిదని భావము.

ఏవమాది=ఇది మొదలుగా, విచార్య=తలపోసి, ఏతత్=ఈ, ఫలం=పండును, రాజ్ఞే=రాజునకు, దద్యాం=ఇచ్చెదను. సః=ఆ రాజు, జరామరణవర్జితః=చావుపుట్టుకలు లేనివాడు, భూత్వా=అయి, చాతుర్వర్ణ్యం=నాలుగు వర్ణములవారిని, ధర్మతః=న్యాయముచే, సవిశేషం=బాగుగా, పాలయేత్ = రక్షించును. ఇతి=అని, నిశ్చిత్య=నిశ్చయించుకొని, తత్-ఫలం = ఆపండును, గృహీత్వా=తీసుకొని, రాజసమీపం = రాజు చేరువకు, ఆగత్య = వచ్చి.

6. శివపరమైన యర్థము.—అహి ఇన మాలికాం-అహి=పాములకు, ఇన=ప్రభువగు ఆదిశేషుడను, మాలికాం=పూలదండను, బిభ్రత్=మోయువాడును, తథాపి= అయినను, ఇతాంబరం=వస్త్రములేని (దిగంబరమైన), వపుః = శరీరమును, బిభ్రత్ = ధరించునట్టి, హరః=శివుడును, (విష్ణుపరమైనయర్థము) అహీనమాలికాం-అహీన=

ఇత్యాశిషం ప్రయుజ్య ఫలం దత్త్వా భణతిస్మ—'భో రాజన్! దేవతావరప్రసాదలబ్ధ మిద మపూర్వం ఫలం భక్షయ. అనేన త్వం జరామరణవర్జితో భవిష్యసి.' రాజా తు తత్ఫలం గృహీత్వా బ్రాహ్మణంసమ్మాన్య ప్రేష్య విచారయతి స్మ:—'అహో! మమై తత్ఫలభక్షణా దమరత్వం భవిష్యతి! మమ త్వనఙ్గసేనాయాం మహతీ ప్రీతి రస్తి. సా మయి జీవతి మ్రియేతచేత్ తస్యా వియోగదుఃఖం సోఢుం న శక్నోమి. తస్మాదిదం ఫలం మమ ప్రాణప్రియాయా యనఙ్గసేనాయై దాస్యామీ'తి అనన్తరం రాజా తామా హూయ తస్యై తత్ఫలం దదౌ. తస్యా మన్దురికః కశ్చిత్ ప్రియతమః; సాపున ర్విచార్య

---

తగ్గని (వాడని), మాలికాం=పుష్పహారమును, తథా=అట్లే, పీతాంబరం=పచ్చనిపచ్చడముగల, వపుః=శరీరమును, బిభ్రత్=మోయువాఁడును అగు, హరిః=విష్ణువును, హే భూపాల=ఓరాజా!, తవ=నీకు. మంగళం=క్షేమమును, కరోతు=చేయునుగాక.

తా. నాగభూషణంబులఁ దాల్చిన దిగంబరుండగుశివుండు, వనమాలిక యను హారమును, పీతాంబరమును దాల్చినవిష్ణుండును నీకు క్షేమముఁ గావింతురుగాక.

ఇతి=అని, ఆశిషం=దీవనను, ప్రయుజ్య=చేసి, ఫలం=పండును, దత్త్వా=ఇచ్చి, భణతిస్మ=చెప్పెను. భోరాజన్=ఓరాజా! దేవతా...లబ్ధం-దేవతా = దేవతయొక్క, వర=ఇష్టదానముయొక్క, ప్రసాద=అనుగ్రహముచేత, లబ్ధం=పొందఁబడిన, ఇదం=ఈ, అపూర్వం=వింతయైన, ఫలం = పండును, భక్షయ=తినుము. అనేన=ఈపండు తినుటచేత, త్వం=నీవు, జరామరణవర్జితః=ముదిమి చావులులేనివాఁడవు, భవిష్యసి=కాఁగలవు. రాజాతు = రాజన్ననో, తత్ ఫలం = ఆపండును, గృహీత్వా=తీసికొని, బ్రాహ్మణం=బ్రాహ్మణుని, ప్రేష్య=పంపి, విచారయతి స్మ = యోచించెను. అహో=అహో!, మమ=నాకు, ఏతత్ ఫలభక్షణాత్=ఈపండుతినుటవలన, అమరత్వం=చావులే కుండుట, భవిష్యతి=కలుగఁగలదు. మమతు=నాకన్ననో, అనంగసేనాయాం=అనంగసేన (పట్టపురాణి)యందు, మహతీ=మిక్కుటమైన, ప్రీతిః=ప్రేమ, అస్తి=కలదు. సా=ఆనాప్రియురాలు, మయి=నేను, జీవతిసతి=బ్రతికియుండఁగా, మ్రియేతచేత్=చచ్చెనేని, తస్యాః=దానియొక్క, వియోగదుఃఖం=ఎడబాటువలని వ్యసనమును, సోఢుం=ఓర్చుకొనుటకు, న శక్నోమి=చాలను. తస్మాత్=కాబట్టి, ఇదంఫలం=ఈపండును, మమ=నాయొక్క, ప్రాణప్రియాయై=ప్రాణమువలె నిష్టురాలైన, అనంగసేనాయై=అనంగసేనకొఱకు, దాస్యామి=ఇచ్చెదను. ఇతి=అని, అనంతరం = పిదప, రాజా=భర్తృహరిమహారాజు, తాం=ఆఅనంగసేనను, ఆహూయ=పిలిపించి,తస్యై=దానికొఱకు, తత్ ఫలం=ఆపండును, దదౌ=ఇచ్చెను. తస్యాః=ఆరాజుగారిదేవికి, కశ్చిత్=ఒక, మందురికః=గుఱ్ఱపువాఁడు, ప్రియతమః=కడునిష్టుఁడు. సాపునః=ఆదేవియు, విచార్య

తస్మై తత్ఫలం దదౌ. తస్య కాచి ద్దాసీ ప్రియతమా; స తస్యై ప్రాదాత్. తస్యాః కశ్చి ద్గోపాలః ప్రియః, సా తస్మై ప్రాదాత్. తస్య కస్యాంచి ద్గోమయధారిణ్యాం మహా త్ప్రేమాభూత్. సోఽపి తస్యై ప్రాయచ్ఛత్. తతః సా గోమయధారిణీ గ్రామా ద్బహి ర్గోమయం హృత్వా తద్భాజనం శిరసి నిధాయ తదుపరి తత్ఫలం నిక్షిప్య రాజవీథ్యా మాజగామ. తావ ద్రాజా భర్తృహరీ రాజకుమారైః సహ బహి ర్గచ్ఛన్ తస్యాః శిరస్స్థాపితగోమయాగ్రస్థితం ఫలం దృష్ట్వా గృహ మాగత్య బ్రాహ్మణ మాహూ యావదత్:—'భో బ్రాహ్మణ! త్వయా య త్ఫలం దత్తం తాదృశ మన్యత్ కి మస్తి?' బ్రాహ్మణః:—"భో రాజన్! తత్ఫలం దేవతావరప్రసాదలబ్ధమ్; తాదృశం

---

=ఆలోచించి, తస్మై = వానికొఱకు, తత్ఫలం = ఆపండును, దదౌ = ఇచ్చెను. తస్య= వానికి, కాచిత్ =ఒకానొక, దాసీ = వరవృడము సేయునది, ప్రియతమా = కడునిష్టరాలు. సః=ఆగుఱ్ఱపువాఁడు, తస్యై = ఆదానికొఱకు, ప్రాదాత్ =ఇచ్చెను. తస్యాః = ఆదానికి, కశ్చిత్ =ఒకానొక, గోపాలః=గొల్లవాఁడు, ప్రియః=వలపుఁగూర్చువాఁడు. సా = ఆదాసి, తస్మై = ఆగొల్లనికొఱకు, ప్రాదాత్ =ఇచ్చెను. తస్య = ఆగొల్లనికి, కస్యాం చిత్ =ఒకానొక, గోమయధారిణ్యాం = పేఁడయెత్తుదానియందు, మహత్ = ఎక్కువ, ప్రేమ = చెలిమి, అభూత్ = ఉండెను. సోఽపి=ఆగొల్లఁడును, తస్యై = దానికొఱకు, ప్రాయచ్ఛత్ =ఇచ్చెను. తతః=తర్వాత, సా=ఆ, గోమయధారిణీ=పేఁడ మోయునది, గ్రామాత్-బహిః = ఊరికివెలుపల, గోమయం=పేఁడను, హృత్వా=తీసికొని (పోగుచేసికొని), తత్-భాజనం = ఆపేఁడగంపను, శిరసి=తలమీఁద, నిధాయ= ఉంచుకొని, తదుపరి = ఆపేఁడగంపమీఁద, తత్-ఫలం=ఆపండును, నిక్షిప్య=ఉంచుకొని, రాజవీథ్యాం=రాజమార్గమున, ఆజగామ=వచ్చెను. తావత్ = అప్పుడు, భర్తృహరిః-రాజా=భర్తృహరిమహారాజు, రాజకుమారైః-సహ=రాజపుత్రులతోఁగూడ, బహిః=వెలుపల, గచ్ఛన్=పోవుచు, తస్యాః=ఆపేఁడమోయుదానియొక్క, శిరః... స్థితం-శిరః=తలమీఁద, స్థాపిత = ఉంచఁబడిన, గోమయ = పేఁడయొక్క, అగ్ర = కొనయందు, స్థితం=ఉన్నయట్టి, ఫలం=పండును, దృష్ట్వా=చూచి, గృహం=నగరుకు, ఆగత్య = వచ్చి, బ్రాహ్మణం = (పండునిచ్చిన) బ్రాహ్మణుని, ఆహూయ = పిలిపించి, అవదత్ = అడిగెను. భో బ్రాహ్మణ = ఓబ్రాహ్మణుఁడా! త్వయా = నీచే, యత్= ఏ, ఫలం = పండు, దత్తం = ఈఁబడినదో, తాదృశం = అట్టి, అన్యత్ = వేఱొక, ఫలం=పండు, అస్తికిం=ఉన్నదా! బ్రాహ్మణః (ఆహ)=విప్రుఁడు బదులుచెప్పెను. భో రాజన్=ఓరాజా!, తత్ ఫలం=ఆపండు, దేవతావరప్రసాదలబ్ధం=కాళికాదేవియొక్క వరానుగ్రహమువలన పొందఁబడినది. (దేవతావరమువలన దొరకినది అని భావము.)

ఫలం భూలోకే నాస్తి. సత్య మేతత్. రాజా నామ సాక్షా దీశ్వరః. తస్య పురతో ఽనృతం న వాచ్యమ్. స దేవవ న్నిరీక్షణీయః. తథా చోక్తమ్:—

సర్వదేవమయో రాజా ఋషిభిః పరికీర్తితః,
తస్మాత్తం దేవవ త్పశ్యే న్నవ్యలీకం వదే త్సుధీః. 7

రాజా.—'తాదృశం ఫల మిదానీ మేవ దృష్టం రాజవీథ్యామ్.' బ్రాహ్మణః:—'మయా దత్తం ఫలం భక్షితం వా నవా?' రాజా:—'నాహ మభక్షయమ్, కింతు మమ ప్రాణప్రియాయా యనఙ్గసేనాయై ప్రాదామ్.' బ్రాహ్మణః.—'తర్హి తాం పృచ్ఛ.' రాజా తా మాహూయ సశపథ మపృచ్ఛత్. అనఙ్గసేనా 'మయా తత్ఫలం మన్దురికాయ దత్త' మితి బభాణ. స త్వాకారితో దాస్యై దత్త మి త్యకథయత్.

తాదృశంఫలం=అట్టిపండు, భూలోకే= భూలోకమందు, నాస్తి=లేదు. ఏతత్=ఇది, సత్యం=నిజము. రాజానామ=రాజు అనఁగా, సాక్షాత్ = ప్రత్యక్షమైన, ఈశ్వరః= దేవుఁడు. తస్య=అతనియొక్క, పురతః=ముందట, అనృతం=అసత్యము, న వాచ్యమ్= ఆడఁదగదు. సః=అతఁడు, దేవవత్ = దేవతతో సమానముగా, నిరీక్షణీయః = చూడఁదగినవాఁడు. తథాచ = అలాగే, ఉక్తం = చెప్పఁబడినది.

7. రాజా=ఱేఁడు, సర్వదేవమయః=సకలదేవతల స్వరూపుఁడుగా, ఋషిభిః = ఋషులచే, పరికీర్తితః = చెప్పఁబడుచున్నాఁడు. తస్మాత్ = ఆకారణమువలన, తం = ఆఱేనిని, దేవవత్ = దేవతతో సమానముగా, పశ్యేత్ = చూడవలెను. సుధీః = పండితుఁడు, వ్యలీకం=అసత్యమును, న వదేత్=చెప్పఁగూడదు.—రాజా (ప్రాహ)= రాజు పలికెను. తాదృశం - ఫలం = అట్టిపండు, రాజవీథ్యాం = రాజమార్గమునందు, ఇదానీం-ఏవ=ఇప్పుడే, దృష్టం = చూడఁబడినది, బ్రాహ్మణః (ప్రాహ) = విప్రుఁడు పలికెను. మయా=నాచేత, దత్తం=ఇయ్యఁబడిన, ఫలం = పండు, భక్షితం-వా = తినఁబడినదా?' న(భక్షితం)వా=లేదా?' రాజా(ప్రాహ)=రాజుపలికెను. అహం=నేను, న-అభక్షయం=తినలేదు. కింతు = ఇఁక నేమియనిన, మమ = నాయొక్క, ప్రాణప్రియాయై= ప్రాణవల్లభయగు, అనఙ్గసేనాయై=అనంగసేనకొఱకు, ప్రాదామ్=ఇచ్చితిని. బ్రాహ్మణః (ప్రాహ)=విప్రుఁడు పలికెను. తర్హి = అయితే, తాం=ఆమెను, పృచ్ఛ = అడుగుము. రాజా=ఱేఁడు, తాం=ఆదేవిని, ఆహూయ=పిలిచి, సశపథం=ప్రమాణపూర్వకముగా, అపృచ్ఛత్ = అడిగెను. అనంగసేనా=రాజుభార్య, మయా = నాచేత, తత్ఫలం = ఆ పండు, మందురికాయ=గుఱ్ఱపువానికొఱకు, దత్తం=ఈఁబడినది. ఇతి=అని, బభాణ= చెప్పెను. స - తు=ఆగుఱ్ఱపువాఁడును, ఆకారితః = పిలిపింపఁబడినవాఁడై, దాస్యై = పనికత్తెకొఱకు, దత్తం=ఈఁబడినది. ఇతి=అని, అకథయత్ = చెప్పెను. దాసీ=పని

దాసీ గోపాలా యేతి, గోపాలో గోమయధారిణ్యా ఇతి, అవాదీత్. తతో జాత సంప్రత్యయో రాజా విషాదం పరమం గత్వా ససంభ్రమం గోమయధారిణీ మాకార్య తత్ఫలం గృహీత్వా కతిచి చ్ఛ్లోకా నపాఠీత్:—

రూపే మనోహారిణి యౌవనేచ వృథైవ పుంసా మభిమానబుద్ధిః,
నతభ్రువాం చేతసి చిత్తజన్మా కర్తుం యదే వేచ్ఛతి తత్కరోతి. 8

అహో! స్త్రీణాం చిత్తం చరిత్రం చ కే నాపి జ్ఞాతుం న శక్యతే? త దుక్తమ్:—

అశ్వప్లుతం వాసవగర్జనం చ స్త్రీణాం చ చిత్తం పురుషస్య భాగ్యమ్,

---

కత్తై, గోపాలాయ-ఇతి=గొల్ల వానికని, గోపాలః=గొల్ల వాఁడు, గోమయధారిణ్యై-ఇతి =పేఁడ మోయుదానికి అని, అవాదీత్=పలికెను. తతః=తర్వాత, రాజా=భర్తృహరి, జాతసంప్రత్యయః=పుట్టిననమ్మకముగలవాఁడై, పరమం=ఎక్కువయిన, విషాదం=వ్యసనమును, గత్వా=పొంది, ససంభ్రమం=త్వరితముగా, గోమయధారిణీం = పేఁడమోయుదానిని, ఆకార్య=పిలిపించి, తత్ఫలం = ఆపండును, గృహీత్వా = కైకొని, కతిచిత్ = కొన్ని, శ్లోకాన్ = శ్లోకములను, అపాఠీత్ = చదివెను.

8. మనోహారిణి=సొగసయిన, రూపే=రూపమునందును, యౌవనే-చ=ప్రాయమునందును, పుంసాం=మగవారికి, అభిమానబుద్ధిః=గర్వముతోడితలంపు, వృథా-ఏవ=పనికిరానిదే. నతభ్రువాం = వంకరకనుబొమలు గలవారియొక్క (ఆఁడువారియొక్క), చేతసి=మనసునందు, చిత్తజన్మా=మన్మథుఁడు, యత్-ఏవ=దేనిని, కర్తుం=చేయుటకు ఇచ్ఛతి=కోరుచున్నాఁడో, తత్=దానిని, కరోతి=చేయుచునేయున్నాఁడు.

తా. మగవారు మనము అందగాండ్రము. మనము మంచి ప్రాయమునందున్నాము. మన స్త్రీలు మనలను విడిచి పరాయి పురుషులను గోరరని తలంతురు. అట్టియభిమానముంచుట వ్యర్థము. వారి మనసులో మన్మథుఁడు చొచ్చి, వారిచేత నేమేమి చేయింపఁదలఁచునో, దానిని తానే వారిచేతఁ జేయించును. అనఁగా వారి యిచ్చ చొప్పున వారు నడచుకొందురు.

అహో=అహా!, స్త్రీణాం=స్త్రీలయొక్క, చిత్తం = మనస్సును, చరిత్రం-చ= నడవడియు, కేన-అపి=ఒకనిచేతను, జ్ఞాతుం=తెలిసికొనుటకు, న-శక్యతే=వీలు కాదు. తత్=ఆసంగతి, ఉక్తం=చెప్పఁబడి యున్నది.

9. అశ్వప్లుతం=గుఱ్ఱముయొక్క దుముకును, వాసవగర్జనం-చ=మబ్బులయురుమును, స్త్రీణాం = ఆఁడువారియొక్క, చిత్తం-చ=మనస్సును, పురుషస్య = మగవాని

అవర్షణం చాప్యతివర్షణం చ దేవో న జానాతి కుతో మనుష్యః॥

తథాచ, గృహ్ణన్తి విపినే వ్యాఘ్రం విహఙ్గం గగనే స్థితమ్,
సరిన్మధ్యగతం మీనం న స్త్రీణాం చపలం మనః. 10

కించ, హీనభాగ్యస్య రాజ్యశ్రీః పుష్పశ్రీ ర్గగనస్య వా,
భవే దేవ న తు స్త్రీణాం మనశ్శుద్ధి ర్మనా గపి. 11

అపిచ, సుఖ దుఃఖ జయ పరాజయ జీవిత మరణాని యే విజానన్తి,
ముహ్యన్తి తే హి నూనం తత్త్వవిదశ్చాపి చేష్టితైః స్త్రీణామ్,

---

యొక్క, భాగ్యం = సంపదను, అవర్షణం-చ=వానకురియమియు, అతివర్షణం-చ = ఎక్కువగా వానకురియుటయు, దేవః=దేవుఁడే, న-జానాతి=ఎఱుఁగఁడు. మనుష్యః =మానవుఁడు, కుతః = ఎట్లు, (జానాతి = ఎఱుఁగఁగలఁడు?)

10. తథాచ=అట్లే, విపినే=అరణ్యమందు, (స్థితం=ఉన్న,) వ్యాఘ్రం=పులిని, గృహ్ణన్తి = పట్టుదురు. గగనే = ఆకసమందు, స్థితం = ఉన్న, విహఙ్గం = పక్షిని, (గృహ్ణన్తి = పట్టుదురు.) సరిన్మధ్యగతం-సరిత్ = ఏటియొక్క, మధ్య = నడిమిభాగమును, గతం=పొందిన, మీనం=చేఁపను, (గృహ్ణన్తి = పట్టుదురు.) స్త్రీణాం = ఆఁడువారియొక్క, చపలం = చంచలమైన, మనః=మనస్సును, న (గృహ్ణన్తి)=పట్టజాలరు.

తా. అరణ్యమునఁ దిరుగు పులిని, ఆకసంబున నెగురు పక్షిని, నీటి నడుమనున్న చేఁపను బట్టవచ్చునుగాని, స్త్రీలయొక్క చంచలములగు మనస్సును గనిపెట్టుట కష్టము.

11. కించ=మఱియు, హీనభాగ్యస్య = అదృష్టము లేనివానికి, రాజ్యశ్రీః = రాజ్యసంపద వచ్చుటగాని, గగనస్య = ఆకసమునకు, పుష్పశ్రీః - వా = పువ్వుల శోభగాని, భవేత్ - ఏవ = కలుగనైనను గలుగవచ్చును. స్త్రీణాం = ఆఁడువారికి, మనశ్శుద్ధిః - తు = మనస్సుయొక్క పరిశుద్ధత యన్ననో, మనాక్ - అపి = ఇంచుకయైనను, న-భవేత్ = కలుగనేరదు.

12. అపిచ = మఱియు, సుఖ...రణాని-సుఖ = సౌఖ్యమును, దుఃఖ=వ్యసనమును, జయ = గెల్పును, పరాజయ = అవమానమును, జీవిత = బ్రతుకును, మరణాని = చావును, యే=ఎవరు, విజానన్తి = ఎఱుఁగుదురో, తే=అట్టి, తత్త్వవిదః - చ-అపి = బ్రహ్మజ్ఞానులు సైతము, స్త్రీణాం=ఆఁడువారియొక్క, విచేష్టితైః = తగుతగు చేష్టలచేత, నూనం = నిక్కముగా, ముహ్యన్తి = అజ్ఞానమునఁ బడుచున్నారు.

అన్యచ్చ, స్మరోపమ మపి ప్రాప్య వాఞ్ఛన్తి పురుషాన్తరమ్,
నార్య స్సర్వా స్స్వభావేన నోచ్యన్తే హ్యమలాశయాః. 13
తథాచ, వినా యన్త్రేణ మన్త్రేణ తన్త్రేణ వినయేన చ,
వఞ్చయన్తి నరం నార్యః ప్రజ్ఞాధన మపి క్షణాత్. 14
కులజాతిపరిభ్రష్టం నికృష్టం దుష్టచేష్టితమ్,
అస్పృశ్య మధమం ప్రాయో మన్యే స్త్రీణాం ప్రియం వరమ్.
గౌరవేషు ప్రతిష్ఠాసు గుణే ష్వారాధ్యకోటిషు,
ధృతా అపి నిమజ్జన్తి దోషపఙ్కే స్వయం స్త్రియః. 16

---

తా. భూతభవిష్యద్వర్తమానముల నెఱిఁగినమునులుగూడ స్త్రీల యొయ్యారములను జూచి మోసపోవుదురు.

13. అన్యత్-చ=వేఱొకటియు, నార్యః-సర్వాః=స్త్రీలందఱు, స్మరోపమం-స్మర=మన్మథుఁడు, ఉపమం=సాటిగాఁగల మగనిని, ప్రాప్య-అపి=పొందియు, పురుష-అన్తరం = వేఱొకపురుషుని, వాఞ్ఛన్తి=కోరుదురు. స్వభావేన = తఱచుగా, అమల-ఆశయాః=నిర్మలమగు మనస్సుగలవారని, న-ఉచ్యంతే-హి=చెప్పఁబడరుగదా.

14. తథాచ=అట్లే, యన్త్రేణ = యన్త్రము, మన్త్రేణ = మంత్రము, తన్త్రేణ= తంత్రము, వినయేన = అడఁకువ, వినా=లేకయే, నార్యః = స్త్రీలు, ప్రజ్ఞాధనం-అపి=బుద్ధియే ధనముగాఁగలవానినైనను, నరం = పురుషుని, క్షణాత్ = శీఘ్రముగా, వఞ్చయన్తి=మోసపుత్తురు.

15. అస్పృశ్యం = తాఁకఁగూడనివానిని, అధమం = నీచుని, కులజాతిపరిభ్రష్టం - కుల = వంశమునుండి, జాతి = జాతినుండి, పరిభ్రష్టం = పడినవానిని (కులజాతులుతప్పినవానిని), నికృష్టం = హీనుని, దుష్టచేష్టితం = చెడ్డనడవడిగలవానిని, ప్రాయః = తఱచుగా, స్త్రీణాం = ఆఁడువారికి, ప్రియం = ఇష్టుఁడయిన, వరం = పెనిమిటినిగా, మన్యే = తలంచెదను.

తా. కులము తక్కువఁడైనను, చండాలుఁడయినను, చెడువడవడి గలవాఁడయినను స్త్రీలకు ప్రియుఁడగును. అట్టివానినే వారు ప్రియునిఁగాఁ దలంతురు.

16. గౌరవేషు = మర్యాదయందును, ప్రతిష్ఠాసు = కీర్తులయందు, గుణేషు = సుగుణములయందు, ఆరాధ్యకోటిషు - ఆరాధ్య = పూజచేయఁదగిన వారియొక్క, కోటిషు=సమూహములయందు, ధృతా-అపి=ఉంచఁబడినవారయినను, స్త్రియః=ఆఁడు

ఏతా హసన్తి చ రుదన్తి చ కార్యహేతో
ర్విశ్వాసయన్తి చ నరం న తు విశ్వసన్తి,
తస్మా న్నరేణ కులశీలవతా సదైవ
నార్యః శ్మశానసుమనా ఇవ వర్జనీయాః. 17

అన్యచ్చ, న వైరాగ్యా త్పరం భాగ్యం న బోధా దపరః సఖా,
న హరే రపర స్త్రాతా న సంసారా త్పరో రిపుః. 18

ఇత్యేవం పఠిత్వా పరం విరక్తో భర్తృహరి ర్విక్రమార్కం రాజ్యేఽభిషిచ్య తత్ఫలం తస్మై దత్త్వా స్వయం వనం జగామ. తతః ప్రాప్తరాజ్యో విక్రమః సకలా మపి వసుంధరాం న్యాయేన పర్యపాలయత్.

---

వారు, స్వయం=తాముగా, దోషపఙ్కే = పాపమనుబురదలో, నిమజ్జన్తి = మునుఁగుచున్నారు.

17. ఏతాః=ఈస్త్రీలు, కార్యహేతోః=పనినిమిత్తమై, హసన్తి-చ = నవ్వను నవ్వుదురు. రుదన్తి-చ = ఏడ్వను ఏడ్చెదరు. నరం = మనుష్యుని-మగవానిని, విశ్వాసయన్తి-చ=నమ్మింపను నమ్మించెదరు. (కిం)తు=అయితే, న-విశ్వసన్తి=తాముమాత్రము నమ్మరు. తస్మాత్=కనుక, కులశీలవతా = మంచి కొలమునఁ బుట్టుకయు, మంచి నడవడియుఁగల, నరేణ=మనుజునిచేత, సదా-ఏవ=ఎల్లప్పుడును, నార్యః=స్త్రీలు, శ్మశానసుమనా-ఇవ=వల్లకాటిసందలి జాజి పువ్వులవలె, వర్జనీయాః=విడువఁదగినవారు.

18. వైరాగ్యాత్=విరక్తికంటె, పరం=మించిన, భాగ్యం=దైవము, న=లేదు. బోధాత్=బ్రహ్మజ్ఞానముకంటె, అపరః = వేఱొక, సఖా = చెలికాఁడు, న=లేఁడు. హరేః = విష్ణువుకంటె, అపరః=మించిన, త్రాతా = రక్షకుఁడు, న=లేఁడు. సంసారాత్=సంసారమునకంటె, పరః=మించిన-వేఱొక, రిపుః = పగతుఁడు, న=లేఁడు.

ఇతి-ఏవం=ఈవిధముగ, పఠిత్వా=చదివి, పరం=మిగుల, విరక్తః=ఆశదిగనాడినవాఁడై, భర్తృహరిః=భర్తృహరి, విక్రమార్కం=విక్రమార్కుని, రాజ్యే=రాజ్యపాలనమునందు, అభిషిచ్య=పట్టాభిషిక్తునిఁ జేసి, తత్-ఫలం=ఆపండును, తస్మై=ఆవిక్రమార్కునికి, దత్త్వా=ఇచ్చి, స్వయం=తాను, వనం=అడవినిగూర్చి, జగామ=వెళ్లెను. తతః=తర్వాత, విక్రమః=విక్రమార్కమహారాజు, ప్రాప్తరాజ్యః=రాజ్యమును బొందినవాఁడై, సకలాం-అపి-వసుంధరాం=భూమిని అంతయు, న్యాయేన=నీతిలో, పర్యపాలయత్=పాలించెను.

తత ఏకదా దిగమ్బరః కశ్చింద్రాజసమీప మాగత్య

లీలయా మణ్డలీకృత్య భుజఙ్గా న్ధారయన్ హరః,
దద్యాద్దేవో వరాహశ్చ తుభ్యమభ్యధికాం శ్రియమ్. 19

ఇత్యాశిష ముక్త్వా రాజహస్తే ఫలం దత్త్వాఽబ్రవీత్:—‘భో రాజన్! అహం కృష్ణచతుర్దశ్యాం మహాశ్మశాన అఘోరమన్త్రేణ హవనం కరిష్యామి. తత్త్వయోత్తర సాధకేన భవితవ్యమ్.’ రాజా చ ‘తథేతి’ ప్రతిజ్ఞాయ తేన సహ పితృవనం ప్రావిశత్. తత్ర దిగమ్బరో నృపం హన్తు మారభ్య తేన స్వయ మేవ హతః. తేన ప్రసఙ్గేన తస్య రాజ్ఞో బేతాళో వశంవదో బభూవ. అష్ట మహాసిద్ధయశ్చ ప్రాప్తాః. తత స్త్రిభువనేఽస్య కీర్తి రనర్గళా గఙ్గేవ బభూవ.

---

19. శివపరమైనయర్థము.—లీలయా = వేడుకతో, భుజఙ్గాన్ = పాములను, మండలీకృత్య=గుండ్రముగాఁజేసి, ధారయన్ = ధరించునట్టి, హరః=శివుఁడును, (విష్ణుపరమైనయర్థము.-) లీలయా = విలాసముతో, భుజం=చేతిని, మండలీకృత్య = వంచి, గాం=భూమిని, ధారయన్ = మీఁదికెత్తిన, దేవః-వరాహశ్చ = వరాహమూర్తియు, తుభ్యం=నీకొఱకు, అభ్యధికాం=మిక్కిలి హెచ్చైన, శ్రియం=సంపదను, దద్యాత్ = ఇచ్చునుగాక. ఇతి=ఇవ్విధముగా, ఆశిషం=దీవనను, ఉక్త్వా=చెప్పి-చేసి, రాజహస్తే= రాజుచేతియందు, ఫలం=పండును, దత్త్వా=ఇచ్చి, అబ్రవీత్=పలికెను. భోరాజన్= ఓరాజా!, అహం= నేను, కృష్ణచతుర్దశ్యాం=కృష్ణపక్షచతుర్దశినాఁడు, మహాశ్మశానే= గొప్పశ్మశానమందు, అఘోరమంత్రేణ = “అఘోరేభ్యో” అనుమంత్రముచేత, హవనం=హోమమును, కరిష్యామి=చేసెదను. తత్ = కాఁబట్టి, త్వయా=నీవు, ఉత్తర సాధకేన=పైపనివాఁడవుగా, భవితవ్యం=ఉండవలసినది. రాజా-చ = విక్రమార్క మహారాజును, తథా=అలాగే, ఇతి=అని, ప్రతిజ్ఞాయ=ఒప్పుకొని, తేనసహ=ఆదిగంబరసన్న్యాసితోఁగూడ, పితృవనం=వలకాటిని, ప్రావిశత్ = చొచ్చెను. తత్ర= అచ్చట, దిగంబరః = సన్న్యాసి, నృపం=రాజును, హన్తుం = చంపుటకు, ఆరభ్య= పూని, తేన=ఆయనచేత, స్వయమేవ=తానే, హతః = చంపఁబడెను. తేన-ప్రసంగేన=ఆసందర్భముచేత, తస్య-రాజ్ఞః=ఆవిక్రమార్కనృపాలునికి, బేతాళః=బేతాళుఁడు, వశంవదః = లోఁబడ్డవాఁడు, బభూవ=ఆయెను. అష్ట=ఎనిమిది, మహాసిద్ధయః-చ=అణిమాది గొప్పసిద్ధులును, ప్రాప్తాః=దొరకినవి. తతః=తర్వాత, త్రిభువనే=ముజ్జగములందు, అస్య=ఈతనియొక్క, కీర్తిః=పేరు, గంగా-ఇవ=గంగవలె, అనర్గళా=అడ్డులేనిది, బభూవ=ఆయెను.

తత్రాన్తరే రమ్భోర్వశ్యోర్నర్తననైపుణ్యాం వివాదస్సమజాయత. తయో రన్తర మవగన్తు మమరేషు కోఽపి న శశాక. ఏకదా సింహాసనాసీనం దేవం వాసవం నారదో బభాణ:—'దేవ! ధరాతలే విక్రమో నామ రాజా జాగర్తి. స సకలకలాభిజ్ఞో విశేషతః సంగీతవిద్యావిచక్షణః. స ఏవైతయో ర్వివాదనిర్ణయం కర్తుం ప్రభవేత్.' తచ్ఛ్రుత్వా మహేన్ద్రో విక్రమ మానేతుం మాతలిం ప్రేషయామాస. విక్రమోఽపి మాతలిసమానీతం రథ మారుహ్య సహైవ బేతాళేన సుధర్మాం ప్రవిశ్య వాసవేన సమ్మానితః సముచిత మాసన మధ్యాస్త. తదానీం రమ్భోర్వశ్యో ర్నృత్తం ప్రావర్తత. రాజా తూర్వశీం ప్రశశంస; నృత్తశాస్త్రరహస్యా న్యుపన్యస్య జయ మూర్వశ్యై ప్రాదా చ్చ. పాకశాసనస్తు పరం సంతుష్య మణిమయ మతిమనోహారం

---

తత్ర-అంతరే=అంతలోపల, రమ్భోర్వశ్యోః = రంభకును ఊర్వశికిని, నర్తననైపుణ్యాం=ఆట నేర్పునందు, వివాదః=జగడము, సమజాయత=కలిగెను. తయోః=వారియొక్క, అంతరం=తారతమ్యమును, అవగన్తుం=తెలిసికొనుటకు, అమరేషు=వేల్పులలోపల, కోఽపి=ఒకఁడును, న-శశాక=నేరఁడాయెను. ఏకదా=ఒకనాఁడు, సింహాసనాసీనం = సింహాసనమునందుఁ గూర్చుండియున్న, దేవం-వాసవం = దేవేంద్రునిగూర్చి, నారదః=నారదమహాముని, బభాణ=పలికెను. దేవ=ఓ వేల్పుతేఁడా!, ధరాతలే=భూలోకంబున, విక్రమో-నామ=విక్రమార్కుఁడను పేరుగల, రాజా=ఱేఁడు, జాగర్తి=ప్రకాశించుచున్నాఁడు. సః=అతఁడు, సకల-కలా-అభిజ్ఞః = అన్ని విద్యలతెలిసినవాఁడు. విశేషతః=మీఁదుమిక్కిలి, సంగీతవిద్యావిచక్షణః = సంగీతశాస్త్రమందు నేర్పరి. సః-ఏవ=అతఁడే, ఏతయోః = ఈరంభోర్వశులయొక్క, వివాదనిర్ణయం = తగవుతీర్పుటను, కర్తుం=చేయుటకు, ప్రభవేత్=చాలును. తత్=ఆమాటను, శ్రుత్వా=విని, మహేంద్రః=వేల్పులఱేఁడు, విక్రమం=విక్రమార్కుని, ఆనేతుం=పిలిపించుటకు, మాతలిం=మాతలిని, ప్రేషయామాస = పంపెను. విక్రమోఽపి=విక్రమార్కుఁడును, మాతలిసమానీతం=మాతలిచేఁ దేఁబడిన, రథం=తేరిని, ఆరుహ్య=ఎక్కి, బేతాళేన-సహ-ఏవ = బేతాళునితోఁ గూడనే, సుధర్మాం=ఇంద్రసభను, ప్రవిశ్య = చొచ్చి, వాసవేన = ఇంద్రునిచేత, సమ్మానితః = గౌరవింపఁబడినవాఁడై, సముచితం = తగిన, ఆసనం = అధ్యాస్త = పీఠము నందుఁ గూర్చుండెను. తదానీం = అప్పుడు, రమ్భోర్వశ్యోః = రంభకును ఊర్వశికిని, నృత్తం = నాట్యము, ప్రావర్తత = నడచెను. రాజా-తు = విక్రమార్కుఁడు, ఊర్వశీం = ఊర్వశిని, ప్రశశంస = పొగడెను. కించ = మఱియు, నృత్తశాస్త్ర రహస్యాని-నృత్తశాస్త్ర = నాట్యశాస్త్రమందలి, రహస్యాని = లోగుట్టులను, ఉపన్యస్య= వివరించి చెప్పి, జయం = గెల్పును, ఊర్వశ్యై = ఊర్వశికి, ప్రాదాత్ = ఇచ్చెను. పాకశాసన-స్తు=

సింహాసన మేక మస్మై ప్రాదాత్. తస్మిన్ సింహాసనే ద్వాత్రింశత్ సాలభఞ్జికాః సన్తి. తాసాం శిరసి పదం నిధాయ త దధ్యాసితవ్యమ్. రాజా తు మహేన్ద్ర మాపృచ్ఛ్య త దాసనం గృహీత్వా నిజపుర మగమత్. తదనన్తర మేకదా శుభే ముహూర్తే విక్రమార్కో బ్రాహ్మణాశీర్వాదపూర్వకం తత్సింహాసన మారుహ్య రాజ్య మకరోత్. ఏవం మహాన్ కాలో గతః.

తత ఏకదా ప్రతిష్ఠాననగరే కస్యాంచిత్ కన్యకాయాం శాలివాహనో నామ సమజాయత. త త్రాన్తరే తూజ్జయినీం పరితో భూకమ్ప ధూమకేతు దిగ్దాహాదీని దుర్నిమిత్తాని దృష్టాని. తతో విక్రమాదిత్యో దైవజ్ఞా నాహూయ భూకమ్పాదిఫలం

---

ఇంద్రుఁడును, పరం = మిక్కిలి, సంతుష్య = సంతోషము నొంది, మణిమయం = రత్నములుచెక్కిన, అతిమనోహరం = మిక్కిలి అందమైన, సింహాసనం - ఏకం = ఒక సింహాసనమును, అస్మై = ఈవిక్రమార్కునకు, ప్రాదాత్ = ఇచ్చెను. తస్మిన్-సింహాసనే = ఆసింహాసనమునందు, ద్వాత్రింశత్ = ముప్పదిరెండు, సాలభఞ్జికాః = బొమ్మలు, సన్తి = ఉన్నవి. తాసాం = వానియొక్క, శిరసి = నెత్తియందు, పదం = అడుగును, నిధాయ = పెట్టి, తత్ = ఆసింహాసనము, అధ్యాసితవ్యం = ఎక్కఁదగినది. రాజా - తు = విక్రమార్కుఁడును, మహేంద్రం = దేవేంద్రుని, అపృచ్ఛ్య = వీడ్కొని, తత్ - ఆసనం = ఆసింహాసనమును, గృహీత్వా = పట్టించుకొని, నిజపురం - తనపురమునకు, అగమత్ = వెళ్లెను. తదనన్తరం = తర్వాత, ఏకదా = ఒకనాఁడు, శుభే = మంచిదైన, ముహూర్తే = లగ్నమందు, విక్రమార్కః = విక్రమార్కుఁడు, బ్రాహ్మణా...ర్వకం - బ్రాహ్మణ = బ్రాహ్మణులయొక్క, ఆశీర్వాద = దీవనలు, పూర్వకం = ముందుగాఁ గలుగునట్లు, తత్ - సింహాసనం = ఆసింహాసనమును, ఆరుహ్య = ఎక్కి, రాజ్యం = రాజ్యమును, అకరోత్ = చేసెను. ఏవం = ఈవిధముగా, మహాన్ - కాలః = చాలకాలము, గతః = కడచెను.

తతః = తర్వాత, ఏకదా = ఒకప్పుడు, ప్రతిష్ఠాననగరే = ప్రతిష్ఠానపట్టణమునందు, కస్యాఞ్చిత్ = ఒకానొక, కన్యకాయాం = కన్నెయందు, శాలివాహనః - నామ = శాలివాహనుఁడని ప్రసిద్ధుడైనవాఁడు, సమజాయత = పుట్టెను. తత్ర - అన్తరే - తు = ఆసమయమునసే, ఉజ్జయినీం - పరితః = ఉజ్జయిని చుట్టును, భూకమ్ప = భూమి కదలుట, ధూమకేతు = తోఁకచుక్క, దిక్ - దాహ = దిక్కులు గాలుట, ఆదీని = మొదలుగాఁగల, దుర్నిమిత్తాని = దుశ్శకునములు, దృష్టాని = తోఁచినవి. తతః = తర్వాత, విక్రమాదిత్యః = విక్రమార్కుఁడు, దైవజ్ఞాన్ = జోస్యులను, ఆహూయ = పిలిపించి, భూకమ్ప-ఆదిఫలం = భూమికదలిక మున్నగువానియొక్క

పప్రచ్ఛ. దైవజ్ఞాః—"భో దేవ! యదయం భూకమ్పస్సంధ్యాకాలే జాతః, అతో రాజ్ఞోఽనిష్టం సూచయతి. తథాచ నారదీయే :—

అనిష్టదః క్షితీశానాం భూకమ్పస్సంధ్యయోర్ద్వయోః,
రాజ్ఞాం వినాశపిశునో ధూమకేతు రుదాహృతః." 20

ఏతద్దైవజ్ఞవచనం శ్రుత్వా రాజాఽబ్రవీత్.—"భో దైవజ్ఞాః! పురా పరమేశ్వరః సంతోషిత స్తపసా మాం ప్రాహ.—'భో రాజన్! ప్రసన్నోఽస్మి. వినాఽమరత్వం వరం యాచస్వే'తి. తతోఽహమవోచమ్-'భో దేవ! సార్ధ ద్విహాయనాయాం కన్యాయా ముత్పన్నాత్ పుత్రాన్మమమృతి రస్త్వితి. తచ్ఛ్రుత్వా దేవ స్తథే త్యనుజగ్రాహ." ఇతి రాజ్ఞో వచనం శ్రుత్వా తర్హి తాదృశః పుత్రో భవిష్యతీ'తి దైవజ్ఞై రప్యు

---

ప్రయోజనమును, పప్రచ్ఛ=అడిగెను. దైవజ్ఞాః (ఊచుః)=జ్యోస్యులు (పలికిరి), భో దేవ=ఓరాజా !, యత్=ఏకారణమున, అయం=ఈ, భూకమ్పః = భూమి కదలుట, సంధ్యాకాలే=సంజవేళయందు, జాతః=పుట్టినదో, అతః=ఆకారణమువలన, రాజ్ఞః= నృపునకు, అనిష్టం = చెఱుపును, సూచయతి = తెలుపుచున్నది. తథాచ = అట్లు, నారదీయే = నారదీయమనుగ్రంథమందు (ఉక్తం = చెప్పఁబడియున్నది.)

20. సంధ్యయోః-ద్వయోః=రెండుసంజలందు, భూకమ్పః=భూమి యదరుట, క్షితీశానాం = రాజులకు, అనిష్టదః=చెఱుపును గలిగించునది, ధూమకేతుః = ధూమకేతువు, రాజ్ఞాం= రాజులకు, వినాశపిశునః=చెఱుపునకు గుఱుతుగా, ఉదాహృతః= చెప్పఁబడియున్నది.

ఏతత్ - దైవజ్ఞవచనం = ఈజ్యోస్యులమాటను, శ్రుత్వా = విని, రాజా= నృపాలుఁడు, అబ్రవీత్=పలికెను. భో దైవజ్ఞాః = ఓజ్యోస్యులారా! పురా=మునుపు, పరమేశ్వరః = శంకరుఁడు, తపసా = నేఁజేసిన తపస్సుచే, సంతోషితః=సంతోష పెట్టఁబడినవాఁడై, మాం = నన్నుఁగూర్చి, ప్రాహ=పలికెను. భో రాజన్=ఓరాజా !, ప్రసన్నః = సంతోషపడినవాఁడను, అస్మి=అయితిని, అమరత్వం - వినా = చావు లేకుంట తప్ప, వరం=ఏవరమునైనను, యాచస్వ = కోరుము. ఇతి = అని, తతః= తర్వాత, అహం = నేను, అవోచం = పలికితిని. భో దేవ = ఓభగవంతుఁడా !, సార్ధ ద్విహాయనాయాం=రెండున్నరయేండ్లు ఈడుగల, కన్యాయాం=పడుచునందు, ఉత్పన్నాత్ = పుట్టిన, పుత్రాత్ = కుమారునివలన, మమ = నాకు, మృతిః = చావు, అస్తు=కలుగునుగాక, ఇతి=అని, తత్=ఆమాటను, శ్రుత్వా=విని, దేవః=శంకరుఁడు, తథా-ఇతి=ఆలాగే నని, అనుజగ్రాహ=అనుగ్రహించెను. ఇతి=ఇట్లుచెప్పిన, రాజ్ఞః = నృపాలునియొక్క, వచనం=మాటను, శ్రుత్వా=విని, తర్హి = అయితే, తాదృశః =

కమ్, రాజాఽపి, 'హా! దైవసృష్టి రచింత్యా! తాదృశః కస్మిన్ దేశే కథ ముత్పన్నో భవిష్యతి!' ఇతి వ్యాకులితచిత్తో బేతాళ మాహూయైత త్సర్వం తస్మై నివేద్యాబ్రవీత్:—'భో యక్ష! పృథివీం పరిభ్రమ. ఏవంవిధః పుత్త్రః కస్మిన్ దేశే కుత్ర నగరే సముత్పన్న ఇతి జ్ఞాత్వా ఝడితి సమాగచ్ఛ' ఇతి. బేతాళోఽపి మహాన్ ప్రసాద ఇతి నిర్గత్య సాగరవేలావలయితాం సగిరికాననాం వసుంధరాం పర్యటన్ ప్రతిష్ఠాననగరం ప్రవిశ్య కుత్రాపి కుమ్భకారగృహే కంచి న్మాణవకం కాంచి త్కన్యకాం చ క్రీడన్తౌ దృష్ట్వాఽపృచ్ఛత్—'కౌ యువా'మితి.—కన్యా:'అయం మమ పుత్త్ర'ఇతి ప్రత్యాహ. బేతాళః.—'క స్తేపితా?' కన్యాః-కఞ్చన బ్రాహ్మణ మదర్శయత్. తతో బ్రాహ్మణ

---

అటువంటి, పుత్త్రః=కొడుకు, భవిష్యతి=కలుగఁగలఁడు, ఇతి=అని, దైవజ్ఞైః-అపి=జ్యోస్యులచేతను, ఉక్తం=చెప్పఁబడెను. రాజా-అపి=విక్రమార్కుఁడును, హా = ఆహా!, దైవసృష్టిః=దైవముయొక్క నిర్మాణము, అచిన్త్యా=యోచింపరానిది. తాదృశః =అట్టిపుత్త్రుఁడు, కస్మిన్ - దేశే=ఏదేశమునందు, కథం=ఏలాగు, ఉత్పన్నః=పుట్టినవాఁడు, భవిష్యతి=కాఁగలఁడు. ఇతి=అని, వ్యాకులితచిత్తః=మనసున కలవరపడినవాఁడై, బేతాళం=బేతాళుని, ఆహూయ=పిలిచి, ఏతత్-సర్వం = ఇది అంతయు, తస్మై=వానికొఱకు, నివేద్య=తెలిపి, అబ్రవీత్=పలికెను. భోయక్ష=ఓబేతాళుఁడా!, పృథివీం = నేలనంతయు, పరిభ్రమ=తిరిగిచుట్టుము, ఏవంవిధః = ఇట్టి, పుత్త్రః= కొడుకు, కస్మిన్-దేశే=ఏదేశమున, కుత్ర-నగరే=ఏపట్టణమున, సముత్పన్నః=పుట్టినవాఁడు, ఇతి=అని, జ్ఞాత్వా=తెలిసికొని, ఝడితి = వేగముగా, సమాగచ్ఛ = రమ్ము, ఇతి=అని. బేతాళోఽపి=బేతాళుఁడును, మహాన్=గొప్ప, ప్రసాదః=అనుగ్రహము, ఇతి=అని, నిర్గత్య = వెడలి, సాగర...యితాం - సాగర = సముద్రముయొక్క, వేలా = గట్టుచేత, వలయితాం = చుట్టఁబడిన, సగిరికాననాం = పర్వతములతోను అడవులతోను కూడిన, వసుంధరాం=భూమిని, పర్యటన్ = అంతటఁ దిరుగుచు, ప్రతిష్ఠాననగరం=ప్రతిష్ఠానపురమును, ప్రవిశ్య = చొచ్చి, కుత్రాపి=ఒకానొక, కుమ్భకారగృహే = కుమ్మరవాని యింటియందు, కఞ్చిత్ - మాణవకం = ఒకపిల్లవానిని, కాఞ్చిత్ - కన్యకాం-చ=ఒక కన్నెను, క్రీడన్తౌ=ఆటలాడువారిని, దృష్ట్వా=చూచి, కౌ-యువాం-ఇతి=మీరు ఎవరని, అపృచ్ఛత్ = అడిగెను. కన్యా(ప్రాహ)=కన్యక (చెప్పెను). అయం=వీఁడు, మమ = నాయొక్క, పుత్త్రః = కొడుకు, ఇతి=అని, ప్రత్యాహ = బదులు చెప్పెను. బేతాళః(ఆహ) = బేతాళుఁడడిగెను, కః-తే-పితా= నీతండ్రి యెవ్వఁడు? కన్యా = ఆకన్యక, కంచన బ్రాహ్మణం = బ్రాహ్మణు నొకనిని, అదర్శయత్=చూపెను. తతః=తర్వాత, బేతాళః=బేతాళుఁడు, బ్రాహ్మణం=బ్రాహ్మ

మపృచ్ఛ ద్వేతాళః. బ్రాహ్మణః—'ఇయం మమ కన్యా. అస్యాః పుత్రోఽయమ్.' తచ్ఛ్రుత్వా విస్మయం గతో వేతాళః పున ర్బ్రాహ్మణ మవాదీత్: 'భో బ్రాహ్మణ! కథ మేతత్?' సోఽబ్రవీత్:—'దేవానాం చరిత్ర మగోచరమ్. అస్యా రూపలావణ్యాతిశయమోహితః శేషో నాగేన్ద్రోఽనయా సంజగామ. తస్మా దస్యాం జాతః పుత్రోఽయం శాలివాహనః.' తచ్ఛ్రుత్వా వేతాళః సత్వర ముజ్జయినీ మాగత్య విక్రమాదిత్యాయ సర్వ మపి వృత్తాన్త మకథయత్. రాజాఽపి తస్య పారితోషికం దత్త్వా ఖడ్గ మాదాయ ప్రతిష్ఠాననగరం ప్రవిశ్య యావ త్ఖడ్గం శాలివాహనే చిక్షేప, తావ త్తేన ఖడ్గేన స్వయ మేవ క్షతః ప్రతిష్ఠాననగరా దుజ్జయిన్యాం నిపపాత. క్షత వేదనాదహ్యమానశరీరోఽన న్తర మేవ జీవితం విససర్జ.

---

ణుని, అపృచ్ఛత్ = అడిగెను. బ్రాహ్మణః (ప్రత్యాహ) = బ్రాహ్మణుఁడు (బదులు చెప్పెను). ఇయం=ఈబిడ, మమ=నాయొక్క, కన్యా=కూఁతురు, అయం = వీఁడు, అస్యాః=దీనియొక్క, పుత్రః=కొడుకు. తత్=ఆమాటను, శ్రుత్వా=విని, విస్మయం= ఆశ్చర్యమును, గతః=పొందిన, వేతాళః = వేతాళుఁడును, పునః=మరల, బ్రాహ్మణం= బ్రాహ్మణునిగూర్చి, అవాదీత్ = పలికెను. భో బ్రాహ్మణ=ఓవిప్రుఁడా!, ఏతత్ = ఇది, కథం=ఏలాగు. (పొసఁగెను.) సః = ఆబ్రాహ్మణుఁడు, అబ్రవీత్ = బదులుచెప్పెను. దేవానాం = వేల్పులయొక్క, చరిత్రం=వృత్తాంతము, అగోచరం = తెలియవీలుకా నిది. అస్యాః=దీనియొక్క, రూప...హితః-రూప=ఆకారముచేత, లావణ్య=అందము యొక్క, అతిశయ = హెచ్చుచేత, మోహితః=ఆశపెట్టఁబడినవాఁడై, నాగేంద్రః = సర్పరాజగు, శేషః=ఆదిశేషుఁడు, అనయా=దీనితో, సంజగామ=కూడెను. తస్మాత్ = ఆకారణమువలన, అస్యాం=దీనియందు, అయం=ఈ, శాలివాహనః=శాలివాహనుఁడు, పుత్రః=కుమారుఁడుగా, జాతః=పుట్టినాఁడు. తత్=ఆమాటను, శ్రుత్వా=విని, వేతాళః=వేతాళుఁడు, సత్వరం = వేగముగా, ఉజ్జయినీం = ఉజ్జయినీపురినిగూర్చి, ఆగత్య= వచ్చి, విక్రమాదిత్యాయ=విక్రమార్కునికి, సర్వమపి-వృత్తాన్తం=సంగతి అంతయును, అకథయత్=చెప్పెను. రాజా-అపి=విక్రమార్కుఁడును, తస్య=అతనికి, పారితోషికం =బహుమానమును, దత్త్వా=ఇచ్చి, ఖడ్గం=కత్తిని, ఆదాయ=తీసికొని, ప్రతిష్ఠాన నగరం=ప్రతిష్ఠానపురమును, ప్రవిశ్య=చొచ్చి, యావత్=ఎంతలోపల, ఖడ్గం = కత్తిని, శాలివాహనే=శాలివాహనునియందు, చిక్షేప=వేసెనో, తావత్=అంతలోపల, తేన-ఖడ్గేన=ఆకత్తిచేత, స్వయం-ఏవ = తానే, క్షతః=గాయపఱుపఁబడినవాఁడై, ప్రతిష్ఠాన నగరాత్=ప్రతిష్ఠానపురమునుండి, ఉజ్జయిన్యాం = ఉజ్జయినియందు, నిపపాత-పడెను. క్షత...రీరః-క్షత=గాయములయొక్క, వేదనా = నొప్పిచేత, దహ్యమాన =

తతో మన్త్రిషు రాజాఽయ మపుత్త్రః. కథం కర్తవ్య మితి విచారయత్సు, భట్టిః ప్రాహ:—'విచార్యతా మాసాం కాపి గర్భిణీ రాజమహిషీణాం స్యా' దితి. తతో విచార్యమాణే కాఽపి సప్తమాసగర్భిణీ సమభూత్. తదా సర్వే మన్త్రిణో మిళిత్వా గర్భ స్యాభిషేకం కృత్వా స్వయం రాజ్యం పర్యపాలయన్. త దిన్ద్రదత్తం సింహాసనం య ద్దైవ శూన్య మాసీత్, తదా మధ్యేసభం కా ప్యశరీరిణీ వాగాసీత్:—'భో మన్త్రిణః! అస్మిన్ సింహాసనే సముపవేష్టుం విక్రమార్కసదృశో రాజా కోఽపి నాఽస్తి, తస్మా దిదం సుక్షేత్రే నిక్షిప్యతామ్!' త చ్ఛ్రుత్వా మన్త్రిణః కుత్రాపి పవిత్రే క్షేత్రే తత్సింహాసనం నిక్షిప్య తత్క్షేత్రం యావనాళచణక

---

కాల్పఁబడిన, శరీరః = శరీరముగలవాఁడై, అనన్తరం - ఏవ = వెంబడినే, జీవితం= ప్రాణమును, విససర్జ = వదలెను.

తతః = తర్వాత, మన్త్రిషు = మంత్రులు, రాజా - అయం = ఈరాజు, అపుత్త్రః=బిడ్డలు లేనివాఁడు, కథం=ఏలాగు, కర్తవ్యం=చేయఁదగినది? ఇతి-విచారయత్సు=అని వగచుచుండఁగా, భట్టిః-ప్రాహ=భట్టి పలికెను. ఆసాం-రాజమహిషీణాం =ఈరాజభార్యలలోపల, కా - అపి = ఎవ్వతెయైనను, గర్భిణీ = కడుపుతో నున్నది, స్యాత్=అయ్యెడినేమో, ఇతి-విచార్యతాం = అని విచారింపఁబడుగాక (మీరు విచారింపుఁడు). తతః=తర్వాత, విచార్యమాణే = (సంగతి)విచారింపఁబడగా, కాఽపి = ఒకానొకతె, సప్తమాసగర్భిణీ=ఏడునెలలగర్భముగలదిగా, సమభూత్ = ఉండెను. తదా=అప్పుడు, సర్వే-మన్త్రిణః=మంత్రులందఱు, మిళిత్వా=కలిసి, గర్భస్య=గర్భమునకు, అభిషేకం=పట్టాభిషేకమును, కృత్వా=చేసి, స్వయం=తాము, రాజ్యం=రాజ్యమును, పర్యపాలయన్=ఏలిరి. తత్=ఆ, ఇన్ద్రదత్తం=ఇంద్రునిచే నియ్యఁబడిన, సింహాసనం=సింహాసనము, శూన్యం = ఉత్తది, యద్దైవ = ఎప్పుడు, అభూత్=ఆయెనో, తదా=అప్పుడు, మధ్యేసభం=సభనడుమ, కాఽపి-అశరీరిణీవాక్=ఒక శరీరము లేని మాట, ఆసీత్=కలిగెను (పుట్టెను.) భోమన్త్రిణః = ఓమంత్రులారా, అస్మిన్-సింహాసనే=ఈసింహాసనమందు, సముపవేష్టుం=కూర్చుండుటకు, విక్రమార్కసదృశః=విక్రమార్కునికిసాటియగు, రాజా=రాజు, కోఽపినాస్తి=ఒక్కరుఁడును లేఁడు, తస్మాత్=కనుక, ఇదం=ఈసింహాసనమును, సుక్షేత్రే=మంచి చేనియందు, నిక్షిప్యతాం=ఉంచఁబడుఁగాక, (ఈసింహాసనమునుఉంచుఁడు.) తత్=ఆమాటను, శ్రుత్వా=విని, మన్త్రిణః=మంత్రులు, కుత్రాపి = ఒకానొక, పవిత్రే=పరిశుద్ధమైన, క్షేత్రే=చేనియందు, తత్-సింహాసనం=ఆసింహాసనమును, నిక్షిప్య = ఉంచి, యావనాళ...సమృద్ధం-యావనాళ= జొన్నలతోను, చణక = సెనగలతోను, సమృద్ధం=నిండిన, తత్-క్షేత్రం=ఆచేనిని,

సమృద్ధం బ్రాహ్మణాయ కస్మైచి ద్దదుః. బ్రాహ్మణోఽపి యత్ర సింహాసనం నిక్షిప్తం తదుచ్చస్థాన మితి పక్షిణా ముత్థాపనార్థం తదుపరి మఞ్చం నిక్షిప్యోపవిశ్య పక్షిణః సముత్థాపయ న్నవర్తత.

అథ కదాచి ద్భోజరాజ స్ససైన్యో మృగయా మటన్ రాజకుమారైః సమేత స్తత్క్షేత్రసమీపే యావ దాజగామ, తావన్మఞ్చోపరిస్థితో బ్రాహ్మణః ప్రాహ—'భో రాజన్! ఏత త్క్షేత్రం ఫలిత మస్తి. ససైన్యేన సమాగత్య భవతా యథేచ్ఛం భుజ్యతామ్, అశ్వేభ్య శ్చణకాదయో దీయన్తామ్, అద్య మమ జీవితం సఫల మాసీత్, యతో భవాన్ మ మాతిథి ర్జాతః. ఈదృశ స్త్వతిథిః కదాఽపి న సందృశ్యతే.' త చ్ఛ్రుత్వా రాజా ససైన్యః క్షేత్రమధ్యం ప్రవివేశ. తతో బ్రాహ్మణః పక్ష్యుత్థాప

---

కస్మైచిత్ = ఒకానొక, బ్రాహ్మణాయ = బ్రాహ్మణునికి, దదుః = ఇచ్చిరి. బ్రాహ్మణోఽపి=బ్రాహ్మణుఁడును, యత్ర = ఏచోట, సింహాసనం=సింహాసనము, నిక్షిప్తం = ఉంచఁబడినదో, తత్=అది, ఉచ్చస్థానం-ఇతి = ఎత్తుచోటని, పక్షిణాం = పక్షులయొక్క, ఉత్థాపనార్థం = తోలుటకై, తదుపరి = దానిమీఁద, మఞ్చం=మంచెను, నిక్షిప్య = కట్టి, ఉపవిశ్య = కూర్చుండి, పక్షిణః = పక్షులను, సముత్థాపయన్ = తోలుచు, అవర్తత = ఉండెను.

అథ=తర్వాత, కదాచిత్=ఒకానొకప్పుడు, భోజరాజః=భోజమహారాజు, ససైన్యః=సేనతోఁగూడినవాఁడై, మృగయాం=వేఁటకై, అటన్=తిరుగుచు, రాజకుమారైః=రాజపుత్రులతో, సమేతః=కూడినవాఁడై, తత్క్షేత్రసమీపే=ఆచేనిదాపునకు, యావత్=ఎప్పుడు, ఆజగామ=వచ్చెనో, తావత్ = అప్పుడు, మఞ్చోపరిస్థితః = మంచమీఁదనున్న, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, ప్రాహ=చెప్పెను. భోరాజన్ = ఓరాజా!, ఏతత్ క్షేత్రం=ఈచేను, ఫలితం|= పండినదిగా, అస్తి=ఉన్నది. ససైన్యేన=సేనతోఁగూడినవాఁడవగు, భవతా=నీవు, సమాగత్య=వచ్చి, యథేచ్ఛం=ఇష్టప్రకారము, భుజ్యతాం=భక్షింపబడుగాక. అశ్వేభ్యః=గుఱ్ఱములకు, చణకాదయః=సెనగలుమొదలగునవి,|దీయన్తాం=చేయఁబడుఁగాక. యతః=ఏకారణముచే, భవాన్=నీవు, మమ=నాకు, అతిథిః=ఆగంతుకుఁడవుగా, జాతః=అయితివో, (తతః=ఆకారణముచే), అద్య=ఇప్పుడు, మమ=నాయొక్క, జీవితం=బ్రతుకు, సఫలం = సార్థకము, ఆసీత్=అయెను. ఈదృశః=ఇటువంటి, అతిథిః=విందు, కదాఽపి=ఎప్పుడును, న సందృశ్యతే=కనఁబడఁడు, తత్-శ్రుత్వా=ఆమాట విని, రాజా=భోజరాజు, ససైన్యః=సేనతోఁగూడినవాఁడై, క్షేత్రమధ్యం=చేని నడుమను, ప్రవివేశ=చొచ్చెను. తతః=తర్వాత, బ్రాహ్మణః=ద్విజుఁడు,

నాయ మఞ్చాదవరుహ్య క్షేత్రమధ్యే ప్రవిష్టం రాజానం దృష్ట్వా భీతోఽభణత్- "రాజన్! కి మేవ మధర్మః క్రియతే? బ్రాహ్మణక్షేత్ర మిదం వినాశ్యతే? యదన్యై రధర్మః క్రియేత త ద్రాజ్ఞే నివేదనీయమ్; త్వ మేవా న్యాయ్యం కర్తుం ప్రవృత్తః. ఇదానీం కో వా నివారయిష్యతి? ఉక్తం చ,

గజే కడఙ్గరీయే తు జారే రాజని వా పునః,
పాపకృత్సు చ విద్వత్సు నియన్తా జన్తు రత్ర కః? 21

అన్యచ్చ, భవాన్ శాస్త్రాభిజ్ఞః బ్రాహ్మణద్రవ్యం కథం వినాశయతి? బ్రహ్మస్వ మేవహి విషమ్. తథా హి,

న విషం విష మి త్యాహు ర్బ్రహ్మస్వం విష ముచ్యతే,

---

పక్షి-ఉత్థాపనాయ = పక్షులను తోలుటకై, మఞ్చాత్ = మంచెనుండి, అవరుహ్య= దిగి, క్షేత్రమధ్యే = చేనినడుమ, ప్రవిష్టం=చొచ్చిన, రాజానం=రాజును, దృష్ట్వా= చూచి, భీతః = భయపడినవాఁడై, అభణత్ = చెప్పెను. రాజన్ = ఓరాజ!, కిం= ఏల, ఏవం=ఈలాగు, అధర్మః=అన్యాయము, క్రియతే=చేయఁబడుచున్నది. ఇదం = ఈ, బ్రాహ్మణక్షేత్రం = బ్రాహ్మణునిచేను, వినాశ్యతే=చెఱుపఁబడుచున్నది. యత్ = ఎప్పుడు, అధర్మః=అన్యాయము, అన్యైః = ఇతరులచేత, క్రియేత = చేయఁబడునో, తత్ = అప్పుడు, (అధర్మః = ఆయధర్మము,) రాజ్ఞే=రాజుకొఱకు, నివేదనీయమ్ = మనవి చేయఁదగినది. త్వం - ఏవ = నీవే, అన్యాయ్యం = న్యాయము తప్పిన పనిని, కర్తుం = చేయుటకు, ప్రవృత్తః = పూనుకొంటివి. ఇదానీం = ఇప్పుడు, కో వా = ఎవఁడు, నివారయిష్యతి = మరల్పఁగలఁడు? ఉక్తంచ=చెప్పఁబడియున్నది.

21. గజే=ఏనుఁగు, కడంగరీయే తు = పొల్లు తినునదియైనను, పునః = ఇంకను, రాజని=రాజు, జారే వా = జారుండయినను, విద్వత్సు = పండితులు, పాపకృత్సుచ= పాపము చేయువారయినను, అత్ర = ఈలోకమున, నియన్తా = శిక్ష చేయునట్టి, జన్తుః = ప్రాణి, కః = ఎవఁడు?

అన్యచ్చ = మఱియు, భవాన్ = నీవు, శాస్త్రాభిజ్ఞః = శాస్త్రములనెఱిఁగిన వాఁడవు. బ్రాహ్మణద్రవ్యం = బాఁపలసొమ్మును, కథం=ఎట్లు, వినాశయతి = పాడు చేయుచున్నావు? బ్రహ్మస్వమేవ=బాఁపలసొమ్మే, విషంహి=విసము కదా. తథాహి = అదెట్లనఁగా.

22. విషం=విషమును, విషమితి=విషమని, నాహుః = (పెద్దలు) చెప్పిరి. బ్రహ్మస్వం = బ్రాహ్మణద్రవ్యము, విషం = విషమని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

విష మేకాకినం హన్తి బ్రహ్మస్వం పుత్త్రపౌత్త్రకమ్. 24

ఇతి తేనోక్తం శ్రుత్వా యావ ద్రాజా క్షేత్రా ద్బహిః సపరివారో నిర్జగామ, తావత్ పక్షిణః సముత్థాప్య పున ర్మఞ్చారూఢో బ్రాహ్మణః ప్రాహ.—'భో రాజన్! కిమితి గచ్ఛసి? ఇదం క్షేత్రం సాధు పరిణతం దృశ్యతే. యావనాళకాన్ చణకాంశ్చ భక్షయన్తు తవ పరివారాః. పశ్యోర్వారుకఫలాని చ సన్తి. యథేష్టం భుజ్యతామ్.' పున ర్బ్రాహ్మణవచన మాకర్ణ్య సపరివారో రాజా యావత్ క్షేత్రమధ్యం ప్రవివేశ, తావ న్మఞ్చా దవరుహ్య స పున స్తథైవాభణత్. తతో రాజా స్వమనసి విచారయతి స్మ. 'అహో! బ్రాహ్మణో యదా మఞ్చ మారోహతి, తదాఽస్య చేతసి

---

విషం=విషము, ఏకాకినం=ఒకనిని మాత్రము, హన్తి=చంపుచున్నది. బ్రహ్మస్వం = బ్రాహ్మణద్రవ్యము, పుత్త్రపౌత్త్రకం = కొడుకులను మనుమలను (వంశమును) (హన్తి = చంపుచున్నది.)—ఇతి = అని, తేన = ఆవిప్రునిచేత, ఉక్తం = చెప్పఁబడినమాటను, శ్రుత్వా = విని, యావత్ = ఎంతలో, రాజా = భోజనృపాలుఁడు, క్షేత్రాత్ - బహిః = చేనివెలుపటికి, సపరివారః = సేనతోఁ గూడినవాఁడై, నిర్జగామ = వెడలి వచ్చెనో, తావత్ = అంతలోపల, పక్షిణః = పక్షులను, సముత్థాప్య = తోలి, పునః = మరల, మంచారూఢః = మంచము నెక్కినవాఁడై, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, ప్రాహ = పలికెను. భోరాజన్ = ఓరాజా!, కిమితి = ఎందులకు, గచ్ఛసి = పోవుచున్నావు. ఇదంక్షేత్రం=ఈచేను, సాధు=లెస్సగా, పరిణతం = పండినదిగా, దృశ్యతే = కనఁబడుచున్నది. తవ = నీయొక్క, పరివారాః= సేనలు, యావనాళకాన్ = జొన్నలను, చణకాంశ్చ = సెనగలను, భక్షయన్తు = తిందురుగాక. ఉర్వారుకఫలానిచ = దోసపండ్లును, సన్తి = ఉన్నవి. పశ్య = చూడుము. యథేష్టం = స్వేచ్ఛగా, భుజ్యతాం = తినఁబడునుగాక. పునః = మరల, బ్రాహ్మణవచనం = బ్రాహ్మణుని పలుకును, ఆకర్ణ్య = విని, సపరివారః = సేనతోఁగూడినవాఁడై, రాజా = భోజనృపాలుఁడు, యావత్ = ఎంతలోపల, క్షేత్రమధ్యం = చేనిమధ్యను, ప్రవివేశ = చొచ్చెనో, తావత్=అంతలోపల, మఞ్చాత్= మంచెనుండి, అవరుహ్య = దిగి, సః = ఆబ్రాహ్మణుఁడు, పునః = మరల, తథైవ = ముందు చెప్పినయట్లే, అభణత్ = పలికెను. తతః = తర్వాత, రాజా = భోజనృపాలుఁడు, స్వమనసి = తనమనస్సునందు, విచారయతిస్మ = ఆలోచించెను. అహో = ఇదేమి వింత!, బ్రాహ్మణః = ఈవిప్రుఁడు, యదా = ఎప్పుడు, మఞ్చం = మంచను, ఆరోహతి = ఎక్కుచుండెనో, తదా = అప్పుడు, అస్య = ఇతనియొక్క, చేతసి =

## ప్రథమోపాఖ్యానమ్.

దాతవ్య మితి బుద్ధి రుత్పద్యతే. యదాఽవతరతి, తదా దీనబుద్ధి రుత్పద్యతే 'అహం మఞ్చ మారుహ్య. పశ్యేయమ్.' ఇతి యావన్మఞ్చ మారురోహ, తావ ద్భోజరాజస్య చేత స్యేవ మభూత్:—నను విశ్వ స్యార్తిః పరిహర్తవ్యా. సర్వ స్యాపి లోకస్య దారిద్ర్యం నివారణీయమ్. దుష్టా దణ్డనీయాః. శిష్టాః పరిపాలనీయాః. ప్రజా ధర్మేణ రక్షణీయాః కిం బహునా, అస్మిన్ సమయే యదికోఽపి మమ శరీర మపి ప్రార్థయిష్యతే త దపి దేయ మితి. తతో రాజా పరమానన్దపరిపూర్ణః పున రపి విచారయతి స్మ:—ఏతత్క్షేత్రమాహాత్మ్యం స్వయ మేవంవిధాం బుద్ధి ముత్పాదయతి. ఉక్తంచ,

> జలే తైలం ఖలే గుహ్యం పాత్రే దానం మనాగపి,
> ప్రజ్ఞే శాస్త్రం స్వయం యాతి విస్తారం వస్తుశక్తితః. 23

---

మనస్సునందు, దాతవ్యం-ఇతి=ఈయవలెనని (దానము చేయవలెనని), బుద్ధిః=తలంపు, ఉత్పద్యతే = పుట్టుచున్నది, యదా =ఎప్పుడు, (మఞ్చాత్=మంచెనుండి,) అవతరతి= దిగుచున్నాఁడో, తదా = అప్పుడు, దీనబుద్ధిః = లోభపుఁదలంపు, ఉత్పద్యతే=పుట్టుచున్నది. అహం= నేను, మఞ్చం=మంచెను. ఆరుహ్య=ఎక్కి, పశ్యేయం = చూచెదను. ఇతి=అని, యావత్ = ఎంతలోపల, మంచం = మంచెను, ఆరురోహ = ఎక్కెనో, తావత్ =అంతలోనే, భోజరాజస్య=భోజభూపాలునియొక్క, చేతసి=మనస్సునందు, ఏవం = ఇట్లు (తలంపు), అభూత్=కలిగెను.

విశ్వస్య=ప్రపంచముయొక్క, ఆర్తిః=బాధ, పరిహర్తవ్యా-నను=పోఁగొట్టఁదగినదికదా. సర్వస్య-అపి-లోకస్య=జనులందఱియొక్క, దారిద్ర్యం=లేమిడి, నివారణీయం=పోఁగొట్టఁదగినది, దుష్టాః=దుర్మార్గులు, దణ్డనీయాః = శిక్షింపఁదగినవారు, శిష్టాః=పెద్దలు (సజ్జనులు), పరిపాలనీయాః=కాపాడఁదగినవారలు, ప్రజాః=జనులు, ధర్మేణ=న్యాయముతో, రక్షణీయాః = కాపాడఁదగినవారు. కిం-బహునా = వేయిమాటలేల, అస్మిన్ - సమయే=ఇప్పుడు, కోఽపి=ఎవ్వఁడయినను, మమ=నాయొక్క, శరీరమపి=దేహమునైనను, ప్రార్థయిష్యతే-యది=కోరెనేని, తదపి=అదియు, దేయం= ఈయఁదగినదే, ఇతి=అని. తతః=తర్వాత, రాజా=భోజరాజు, పరమానన్దపరిపూర్ణః= ఎక్కువసంతోషముతో నిండినవాఁడై, పునరపి = ఇంకను, విచారయతిస్మ=యోచించెను. ఏతత్ క్షేత్రమాహాత్మ్యం = ఈచేనిమహిమ, స్వయం = తానే, ఏవంవిధాం= ఇట్టి, బుద్ధిం=తలంపును, ఉత్పాదయతి=కలిగించుచున్నది. ఉక్తంచ=(అట్లే) చెప్పఁబడియున్నది.

23. జలే=నీటియందు, తైలం=నూనెయు, ఖలే=కొండెగానియందు, గుహ్యం= రహస్యమును, పాత్రే=యోగ్యునియందు, మనాక్-అపి=రవంతయైనను, దానం=దాన

కథ మేతత్క్షేత్రమాహాత్మ్యం జ్ఞాయతామ్?—ఇతి విచార్య బ్రాహ్మణ మాహూయాభణత్:—'భో బ్రాహ్మణ! త వైతత్క్షేత్రే కియాన్ లాభో భవతి?'. బ్రాహ్మణః.—"భో రాజన్! భవాన్ సకలాభిజ్ఞః. అవిదితం తవ కి మపి నాస్తి. యదర్హ మేతత్ త దాలోచయతు భవాన్. అన్యచ్చ, రాజా నామ సాక్షా ద్విష్ణో రవతారభూతః. తస్య కటాక్షా యదుపరి నిపతన్తి తస్య దైన్యదుర్భిక్షాదయో న భవన్తి. రాజా నామ సాక్షాత్ కల్పతరుః. స త్వం మమ దృష్టిగోచరీభూతః. అద్య మమ దారిద్ర్యం సుదూర మపసృతమ్. క్షేత్రం నామ కియత్?"

తతో రాజా బ్రాహ్మణ మనేకధనధాన్యాదినా సంభావ్య క్షేత్రం గృహీత్వా మఞ్చస్యాధ శ్చఖాన. తత్ర పురుషమాత్రే గర్తే శిలైకా సుమనోహరా దృశ్యత.

---

మును, ప్రజ్ఞే=బుద్ధిమంతునియందు, శాస్త్రం=చదువును, స్వయం=తనంతటఁదానే, వస్తుశక్తితః=వస్తువుయొక్క స్వభావమువలన, విస్తారం=ప్రసిద్ధిని, యాతి=పొందుచున్నది.

కథం=ఏలాగు, ఏతత్క్షేత్రమాహాత్మ్యం=ఈచేనిమహిమ, జ్ఞాయతాం=తెలియనగును? ఇతి = అని, విచార్య = ఆలోచించి, బ్రాహ్మణం = బ్రాహ్మణుని, ఆహూయ= పిలిచి, అభణత్ = పలికెను. భో బ్రాహ్మణ = ఓవిప్రుఁడా! తవ = నీకు, ఏతత్క్షేత్రే = ఈ చేనియందు, కియాన్=ఎంతమాత్రము, లాభః = ఆదాయము, భవతి=కలుగుచున్నది. బ్రాహ్మణః-(ప్రాహ) = బ్రాహ్మణుఁడు పలికెను. భోరాజన్=ఓరాజా! భవాన్ = నీవు, సకల-అభిజ్ఞః=అన్నిసంగతులు తెలిసినవాఁడవు. తవ=నీకు, అవిదితం=తెలియనిది, కిమపి=ఏదియు, నాస్తి=లేదు. ఏతత్=ఈచేను, యదర్హం=ఎంతచేయఁదగినదో, తత్=దానిని, భవాన్=నీవు, ఆలోచయతు = యోచింతువుగాక, అన్యచ్చ=అంతియగాక, రాజా నామ=రాజు అనఁగా, సాక్షాత్ = ప్రత్యక్షముగా, విష్ణోః = విష్ణువుయొక్క, అవతారభూతః = అవతారమయినవాఁడు. తస్య = అట్టిరాజుయొక్క, కటాక్షాః = క్రీఁగంటిచూపులు, యదుపరి = ఎవనిమీఁద, నిపతన్తి = పడుచున్నవో, తస్య=వానికి, దైన్య-దుర్భిక్ష - ఆదయః-దైన్య = లేమిడి, దుర్భిక్ష=కఱవు, ఆదయః= మొదలుగాఁగలకీడులు, నభవన్తి=కలుగవు. రాజా నామ=రాజుఅనఁగా, సాక్షాత్= ప్రత్యక్షమైన, కల్పతరుః = కల్పవృక్షమువంటివాఁడు. సః-త్వం = అట్టినీవు, మమ= నాయొక్క, దృష్టిగోచరీభూతః=కంటఁబడినవాఁడవైతివి. అద్య = ఇప్పుడు, మమ= నాయొక్క, దారిద్ర్యం = లేమిడి, సుదూరం=కడుదవ్వు, అపసృతం = పరుగెత్తినది. క్షేత్రంనామ=చేను అనఁగా, కియత్=ఏమాత్రము? తతః=తర్వాత, రాజా=భోజరాజు, బ్రాహ్మణం=విప్రుని, అనేక...దినా-అనేక=విస్తారమైన, ధన=ద్రవ్యము, ధాన్య= ధాన్యము, ఆదినా=మొదలుగాఁగలదానిచేత, సంభావ్య=గారవించి, క్షేత్రం=చేనిని, గృహీత్వా=తీసికొని, మఞ్చస్య=మంచెయొక్క, అధః = క్రిందివైపున, చఖాన=

తచ్ఛిలాధః ప్రదేశే కాఽపి చన్ద్రకాన్తశిలా దృష్టా. తతో నానావిధరత్న ఖచితం ద్వాత్రింశత్సాలభఞ్జికామిళిత మతిరమణీయం సింహాసన మదృశ్యత. తతో భోజః పరమానన్దామృతలహరీపరిపూర్ణహృదయ స్సింహాసనం నగరం నేతుం యావ దుచ్చాలయామాస, తావ దతిగరిష్ఠ మాసనం నోచ్చలాల. తతో రాజా మన్త్రిణ మవదత్!—'కుత స్సింహాసనం నోచ్చలతి?' మన్త్రీ:—'భో రాజన్! దివ్య మేత దాసనమ్. బలిపూజాదికం వినా నోచ్చలతి. తవ సాధ్యం చ న భవతి.' తస్య వచనం శ్రుత్వా రాజా బ్రాహ్మణా నాకార్య తత్ సర్వ మపి విధానం కారితవాన్. తత స్తత్సింహాసనం లఘు భూత్వా స్వయ మే వోచ్చచాల. త దవలోక్య రాజా మన్త్రిణ

త్రవ్వెను. తత్ర=అచ్చట, పురుషమాత్రే=ఒకనిలువులోఁతుగల, గర్తే=గోతిలో, సుమనోహరా=మిక్కిలియుందమైన, శిలా-ఏకా=ఒకబండ, అదృశ్యత=కనఁబడెను. తచ్ఛిలాధఃప్రదేశే=ఆబండయొక్క యడుగున, కాఽపి=ఒకానొక, చన్ద్రకాన్తశిలా=చంద్రకాంతపుఱాయి, దృష్టా=కనఁబడినది. తతః=తర్వాత, నానావిధరత్నఖచితం=అన్నివిధములయిన రత్నములచేఁబొదుగఁబడిన, ద్వాత్రిం...మిళితం-ద్వాత్రింశత్=ముప్పదిరెండు, సాలభంజికా=బొమ్మలతో, మిళితం=కూడిన అతిరమణీయం=మిక్కిలి సొగసయిన, సింహాసనం=సింగపుగద్దియ, అదృశ్యత=కానఁబడెను. తతః=పిమ్మట, భోజః=భోజరాజు, పరమానన్ద...దయః-పరమ=ఎక్కువయిన, ఆనన్ద=సంతోషమనెడి, అమృత=అమృతముయొక్క, లహరీ=ప్రవాహముతో, పరిపూర్ణ=నిండిన, హృదయః=మనస్సుగలవాఁడై, సింహాసనం=ఆసింగపుగద్దెను, నగరం=పట్టణమునకు, నేతుం=తెచ్చుటకై, యావత్=ఎప్పుడు, ఉచ్చాలయామాస=కదలించెనో, తావత్=అప్పుడు, అతిగరిష్ఠం=మిక్కిలిబరువగు, ఆసనం=ఆసింహాసనము, నోచ్చచాల=కదలలేదు. తతః=అటువెనుక, రాజా=భోజుఁడు, మన్త్రిణం=మంత్రినిగూర్చి, అవదత్=పలికెను. కుతః=ఏల, సింహాసనం=సింహాసనము, న-ఉచ్చలతి=కదలకున్నది. మన్త్రీ-(ప్రాహ)=మంత్రి బదులుచెప్పెను. భోరాజన్=ఓప్రభూ! ఏతత్=ఈ ఆసనం=గద్దియ, దివ్యం=దేవతాసంబంధమైనది. బలిపూజా-ఆదికం-వినా=బలి పూజ మొదలుగాఁగలది లేక, న-ఉచ్చలతి=కదలదు. తవ=నీకు, సాధ్యంచ=వశమగునదియు, నభవతి=కాదు. తస్య=ఆమంత్రియొక్క, వచనం=మాటను, శ్రుత్వా=ఆలకించి, రాజా=భోజనరపాలుఁడు, బ్రాహ్మణాన్=విప్రులను, ఆకార్య=పిలిపించి, తత్=ఆ, సర్వం-విధానం-అపి=క్రియసంతటిని, కారితవాన్=చేయించెను. తతః=తర్వాత, తత్-సింహాసనం=ఆ సింగపుగద్దియ, లఘు=తేలికగా, భూత్వా=అయి, స్వయమేవ=తనంతటఁదానే, ఉచ్చచాల=కదలెను. తత్=అట్లు కదలుటను, అవలోక్య=చూచి, రాజా=ఱేఁడు, మన్త్రిణం=మంత్రినిగూర్చి,

ఉవాచ:—“యో౽నర్థం నివారయతి, ఆగామ్యర్థం చ సాధయతి స ఏవ మన్త్రీ. ఉక్తంచ,

స్థితస్య కార్యస్య సముద్భవార్థ మనర్థకార్యప్రతిఘాతనార్థమ్,
ఆగామినో౽ర్థస్య చ సంగ్రహార్థం యో మన్త్రకృత్స్యాత్పరమ
స్స మన్త్రీ”

తతో మన్త్రీ ప్రత్యబ్రవీత్:“మన్త్రిణా స్వామిహితమేవ కర్తవ్యమ్. తథాచోక్తమ్:—
మన్త్రః కార్యానుగో యేషాం కార్యం స్వామిహితానుగమ్,
త ఏవ మన్త్రిణో రాజ్ఞాం న తు యే గల్లపుద్గలాః. 25

అన్యచ్చ:— మన్త్రిణా వినా రాజ్యం, ధాన్యం వినా దుర్గం, కారుణ్యం వినా సౌభాగ్యం, జ్ఞానం వినా వైరాగ్యం, దుర్జనానాం శక్తిః, పాషణ్డానాం మతిః, వైశ్యా

---

ఉవాచ=పలికెను. యః = ఎవఁడు, అనర్థం = చెఱుపును, నివారయతి=పోఁగొట్టుచున్నాఁడో, ఆగామ్యర్థంచ= వచ్చెడికార్యమును, సాధయతి = చక్కఁబెట్టుచున్నాఁడో, స ఏవ=వాఁడే, మన్త్రీ=మంత్రి. ఉక్తంచ=అట్లే చెప్పఁబడినది.

24. యః=ఎవఁడు, స్థితస్య=ఉన్నట్టి, కార్యస్య=పనియొక్క, సముద్భవార్థం=వృద్ధియగు నిమిత్తమును, అనర్థ...ర్థం-అనర్థ = చెడ్డ, కార్య=పనులయొక్క, ప్రతిఘాతనార్థం = తొలఁగించుటకొఱకును, ఆగామినః=రాఁగల, అర్థస్య=పనియొక్క, సంగ్రహార్థంచ=చక్కఁబెట్టు నిమిత్తమును, మన్త్రకృత్=ఆలోచనచేయువాఁడుగా, స్యాత్=అగునో, సః=అతఁడు, పరమః = ముఖ్యుఁడయిన, మన్త్రీ=మంత్రి. తతః=తర్వాత, మన్త్రీ=ప్రధానుఁడు, ప్రత్యబ్రవీత్ = బదులు పలికెను. మన్త్రిణా=మంత్రిచేత, స్వామిహితం-ఏవ=ప్రభునకు హితమగుకార్యమే, కర్తవ్యం = చేయఁదగినది. తథాచ=అట్లే, ఉక్తం = చెప్పఁబడినది.

25. యేషాం=ఎవరియొక్క, మన్త్రః=ఆలోచన, కార్య-అనుగః = కార్యమననుసరించినదో, కార్యం=చేయుపని, స్వామిహితానుగం-స్వామి=ప్రభువుయొక్క, హిత=మేలును, అనుగం=అనుసరించినదో, తఏవ=వారే, రాజ్ఞాం=రాజులకు, మన్త్రిణః=మంత్రులు. యే=ఎవ్వరు, గల్లపుద్గలాః=చెక్కిళ్లచే సొబగయినవారలో, తేతు=వారన్నో, న (మన్త్రిణః) =మంత్రులుగారు.—అన్యచ్చ=మఱియు, మన్త్రిణావినా=మంత్రిలేక, రాజ్యం=ఏలుబడియు, ధాన్యంవినా= ధాన్యములేక, దుర్గం=కోటయు, కారుణ్యం-వినా = దయలేక, సౌభాగ్యం=సంపదయు, జ్ఞానం-వినా= తెలివిలేక, వైరాగ్యం=విరక్తియు, దుర్జనానాం=దుష్టులయొక్క, శక్తిః=బుద్ధియు, పాషణ్డానాం=వేదవిరుద్ధమైన బుద్ధిగలవారియొక్క. మతిః = బుద్ధియు, వైశ్యానాం=కోమటులయొక్క, విశ్వాసః=

